# Sri Rama Pattabhishekam Sarga – శ్రీరామ పట్టాభిషేక సర్గః (యుద్ధకాండం)

STOTRANIDHI.COM | UPDATED ON అక్టోబర్ 26, 2022

(**గమనిక**: ఈ శ్రీరామపట్టాభిషేక సర్గ శ్లోకాలు, “**శ్రీరామ స్తోత్రనిధి** (https://stotranidhi.com/books/sri-raama-stotranidhi-book-in-telugu/)” పుస్తకములో కూడా ఉన్నది. **Click here to buy** (https://publications.stotranidhi.com/link/buy-sramsnte).)

**శిరస్యంజలిమాధాయ కైకేయ్యానందవర్ధనః |**
**బభాషే భరతో జ్యేష్ఠం రామం సత్యపరాక్రమమ్ || ౧**

అర్థం – శిరస్సుపైన తన చేతులతో అంజలి ఘటించి, కైకేయీ ఆనంద వర్ధనుడైన భరతుడు, తన పెద్ద అన్నగారు, సత్యమగు పరాక్రమము కలిగిన శ్రీరామునితో ఇట్లు పలికెను.

**పూజితా మామికా మాతా దత్తం రాజ్యమిదం మమ |**
**తద్దదామి పునస్తుభ్యం యథా త్వమదదా మమ || ౨**

అర్థం – “పూజ్యురాలైన మా అమ్మగారి వలన నాకు వచ్చిన రాజ్యం ఇది. దీనిని మీరు ఇచ్చినట్టుగా మరల మీకు తిరిగి ఇస్తున్నాను.”

**ధురమేకాకినా న్యస్తామృషభేణ బలీయసా |**
**కిశోరవద్గురుం భారం న వోఢుమహముత్సహే || ౩**

అర్థం – బలమైన ఎద్దువలె మోయదగిన ఈ బరువును (రాజ్యభారము) లేగదూడ వలె ఒక్కడిగా ఉన్న నేను మోయలేకున్నాను.

**వారివేగేన మహతా భిన్నః సేతురివ క్షరన్ |**
**దుర్బంధనమిదం మన్యే రాజ్యచ్ఛిద్రమసంవృతమ్ || ౪**

అర్థం – నదీవేగమునకు పగుళ్ళు వచ్చిన ఆనకట్టవలె, ఈ రాజ్యము నియంత్రించుటకు వీలుపడక ఉన్నదని నాకు అనిపించుచున్నది.

**గతిం ఖర ఇవాశ్వస్య హంసస్యేవ చ వాయసః |**
**నాన్వేతుముత్సహే రామ తవ మార్గమరిందమ || ౫**

అర్థం – గుర్రములయొక్క గతిని ఒక గాడిద, హంసలయొక్క గతిని ఒక కాకి వలె పొందలేని విధముగా, నేను మీ మార్గమును అందుకొనలేక పోవుచున్నాను, ఓ శత్రునాశకా !

**యథా చారోపితో వృక్షో జాతశ్చాంతర్నివేశనే |**
**మహాంశ్చ సుదురారోహో మహాస్కంధః ప్రశాఖవాన్ || ౬**

అర్థం – యెటులైతే ఇంటి పెరటిలో నాటి, పెంచబడిన వృక్షము పెద్దదై, భారీ శాఖల వలన బలవంతులకు సైతము ఎక్కుటకు వీలుపడక..

**శీర్యేత పుష్పితో భూత్వా న ఫలాని ప్రదర్శయన్ |**
**తస్య నానుభవేదర్థం యస్య హేతోః స రోప్యతే || ౭**

అర్థం – .. పుష్పములు కలిగన తరువాత, ఫలములు కలుగక ఎండిపోవునో, అటువంటి చెట్టు, నాటిన వాడు అనుభవింపలేని విధముగా ఉన్నట్లు ...

**ఏషోపమా మహాబాహో త్వదర్థం వేత్తుమర్హసి |**
**యద్యస్మాన్మనుజేంద్ర త్వం భక్తాన్భృత్యాన్న శాధి హి || ౮**

అర్థం – ..ఈ ఉపమానము, (గొప్ప భుజములు కల) ఓ మహాబాహో ! మీ దాసులగు మమ్ములను రాజువలె పరిపాలింపని మీకు అర్థము కాగలదు.

**జగదద్యాభిషిక్తం త్వామనుపశ్యతు సర్వతః |**
**ప్రతపంతమివాదిత్యం మధ్యాహ్నే దీప్తతేజసమ్ || ౯**

అర్థం – జగమంతా ఈరోజు పట్టాభిషేకముచే, అమితమైన వేడి కలిగిన మధ్యాహ్న సూర్యుడి వలె ప్రకాశించు మిమ్ములను చూడవలెను.

**తూర్యసంఘాతనిర్ఘోషైః కాంచీనూపురనిస్వనైః |**
**మధురైర్గీతశబ్దైశ్చ ప్రతిబుధ్యస్వ రాఘవ || ౧౦**

అర్థం – సంగీత వాయిద్యముల ఘోషలతో, చిరుగంటల సవ్వడులతో, మధురమైన గానములతో మేలుకొలుపునంతవరకు మీరు విశ్రాంతి తీసుకొనుము.

**యావదావర్తతే చక్రం యావతీ చ వసుంధరా |**
**తావత్త్వమిహ సర్వస్య స్వామిత్వమనువర్తయ || ౧౧**

అర్థం – "ఎప్పటివరకు జ్యోతిశ్చక్రము (ఖగోళము) ఉండునో, ఎప్పటివరకు వసుంధర (భూమి) ఉండునో, అప్పటివరకు ఈ లోకమున మీ స్వామిత్వమును (పరిపాలనను) మేము అనుసరించెదము."

**భరతస్య వచః శ్రుత్వా రామః పరపురంజయః |**
**తథేతి ప్రతిజగ్రాహ నిషసాదాసనే శుభే || ౧౨**

అర్థం – భరతుని వచనములు విన్న పరపురంజయుడైన (పరుల పురమును జయించిన) రాముడు, అటులనే అని

అంగీకరించి శుభప్రదమైన ఆసనమున కూర్చుండెను.

**తతః శత్రుఘ్నవచనాన్నిపుణాః శ్మశ్రువర్ధకాః |**
**సుఖహస్తాః సుశీఘ్రాశ్చ రాఘవం పర్యుపాసత || ౧౩**

అర్థం – తరువాత, శత్రుఘ్నుని సూచనమేరకు, నైపుణ్యము కలిగి, తమ మృదువైన హస్తములతో వేగముగా పనిచేయగల క్షురకులు, రాఘవుని వద్దకు వచ్చిరి.

**పూర్వం తు భరతే స్నాతే లక్ష్మణే చ మహాబలే |**
**సుగ్రీవే వానరేంద్రే చ రాక్షసేంద్రే విభీషణే || ౧౪**

అర్థం – ముందుగా భరతుడు స్నానమాచరించగా మహాబలుడగు లక్ష్మణుడు, వానరరాజగు సుగ్రీవుడు, రాక్షసరాజగు విభీషణుడు, స్నానము చేసెను.

**విశోధితజటః స్నాతశ్చిత్రమాల్యానులేపనః |**
**మహార్హవసనో రామస్తస్థౌ తత్ర శ్రియా జ్వలన్ || ౧౫**

అర్థము – చిక్కులువిడదీయబడిన జటలతో స్నానముచేసి, అందమైన మాలలతో, గంధములతో లేపనము చేయబడి, శ్రేష్ఠమగు వస్త్రములు కట్టుకొని అక్కడ ఉన్న రాముడు శోభతో ప్రకాశించెను.

**ప్రతికర్మ చ రామస్య కారయామాస వీర్యవాన్ |**
**లక్ష్మణస్య చ లక్ష్మీవానిక్ష్వాకుకులవర్ధనః || ౧౬**

అర్థం – రామునియొక్క అలంకారమును చేయు వీర్యవంతుడు, లక్ష్మీత్వము కలిగిన ఇక్ష్వాకు వంశ వర్ధనుడు (శతృఘ్నుడు) లక్ష్మణునికి కూడా చేయసాగెను.

**ప్రతికర్మ చ సీతాయాః సర్వా దశరథస్త్రియః |**
**ఆత్మనైవ తదా చక్రుర్మనస్విన్యో మనోహరమ్ || ౧౭**

అర్థం – సీత యొక్క అలంకరణను దశరథ స్త్రీలు (దశరథ భార్యలు) తమకు తాము చేసుకొనినట్లు మనోహరముగా చేసిరి.

**తతో వానరపత్నీనాం సర్వాసామేవ శోభనమ్ |**
**చకార యత్నాత్కౌసల్యా ప్రహృష్టా పుత్రవత్సలా || ౧౮**

అర్థం – తరువాత వానరపత్నులందరకును, పుత్రవాత్సల్యము చేత ఆనందభరితురాలైన కౌసల్య ఉత్సాముగా అలంకారము చేసెను.

**తతః శత్రుఘ్నవచనాత్సుమంత్రో నామ సారథిః |**
**యోజయిత్వాఽభిచక్రామ రథం సర్వాంగశోభనమ్ || ౧౯**

అర్థం – తరువాత, శత్రుఘ్నుని ఆదేశముమేర సుమంత్రుడు అను పేరుగల రథసారథి సర్వాలంకారములు చేయబడిన రథమును తీసుకువచ్చెను.

**అర్కమండలసంకాశం దివ్యం దృష్ట్వా రథోత్తమమ్ |**
**ఆరురోహ మహాబాహూ రామః సత్యపరాక్రమః || ౨౦**

అర్థం – సూర్యమండలము వంటి శోభకలిగిన దివ్యమైన ఆ రథమును తన ఎదురుగా చూచిన మహాబాహువు, సత్యపరాక్రమవంతుడు అయిన రాముడు దానిని అధిరోహించెను.

**సుగ్రీవో హనుమాంశ్చైవ మహేంద్రసదృశద్యుతీ |**
**స్నాతౌ దివ్యనిభైర్వస్త్రైర్జగ్మతుః శుభకుండలౌ || ౨౧**

అర్థం – సుగ్రీవుడు మరియు హనుమంతుడు మహేంద్రుని వంటి శోభకలవారై, స్నానము చేసి దివ్యమైన వస్త్రములు కట్టుకుని, శుభకరమైన చెవికుండలములు పెట్టుకొనిరి.

**వరాభరణసంపన్నా యయుస్తాః శుభకుండలాః |**
**సుగ్రీవపత్న్యః సీతా చ ద్రష్టుం నగరముత్సుకాః || ౨౨**

అర్థం – గొప్ప ఆభరణములు మరియు శుభకుండలములు పెట్టుకుని వచ్చిన సుగ్రీవపత్ని మరియు సీతా, నగరము చూచుటకు ఉత్సాహముగా యుండిరి.

**అయోధ్యాయాం తు సచివా రాజ్ఞో దశరథస్య యే |**
**పురోహితం పురస్కృత్య మంత్రయామాసురర్థవత్ || ౨౩**

అర్థం – అయోధ్యయందు దశరథరాజు యొక్క మంత్రులు, పురోహితుల సూచనలను అనుసరించి అర్థవంతముగా ప్రణాళికను సిద్ధము చేసిరి.

**అశోకో విజయశ్చైవ సుమంత్రశ్చైవ సంగతాః |**
**మంత్రయన్రామవృద్ధ్యర్థమృద్ధ్యర్థం నగరస్య చ || ౨౪**

అర్థం – అశోకుడు, విజయుడు మరియు సుమంత్రుడు కలిసి, రాముని యొక్క అభివృద్ధి మరియు శ్రేయస్సు కొరకు నగరమందు శ్రద్ధగా మంతనములు చేసిరి.

**సర్వమేవాభిషేకార్థం జయార్హస్య మహాత్మనః |**
**కర్తుమర్హథ రామస్య యద్యన్మంగళపూర్వకమ్ || ౨౫**

అర్థం – "మహాత్ముడైన రాముని పట్టభిషేకము కొరకు విజయసూచికగా చేయవలసిన అన్ని మంగళకరమైన పనులను తప్పక చేయండి."

**ఇతి తే మంత్రిణః సర్వే సందిశ్య తు పురోహితమ్ |**

**నగరాన్నిర్యయుస్తూర్ణం రామదర్శనబుద్ధయః || ౨౬**

అర్థం – అని ఆ మంత్రులకు, అందరు పురోహితులకు తగు సూచనలు చేసి, శ్రీరామ దర్శనముకొరకు నగరము నుండి బయలుదేరిరి.

**హరియుక్తం సహస్రాక్షో రథమింద్ర ఇవానఘః |**
**ప్రయయౌ రథమాస్థాయ రామో నగరముత్తమమ్ || ౨౭**

అర్థం – ఉత్తమైన రథమునందు, వేయికనుల వానివలె (ఇంద్రుడు) కళంకరహితుడగు రాముడు స్వారీ చేయసాగెను.

**జగ్రాహ భరతో రశ్మీఞ్శత్రుఘ్నశ్ఛత్రమాదదే |**
**లక్ష్మణో వ్యజనం తస్య మూర్ధ్ని సంపర్యవీజయత్ || ౨౮**

అర్థం – భరతుడు పగ్గాలను, శత్రుఘ్నుడు ఛత్రమును (గొడుగు) పట్టుకొనెను. లక్ష్మణుడు వ్యజనమును (విసినకర్ర) పట్టుకొని రాముని నుదుటకు గాలి వీయసాగెను.

**శ్వేతం చ వాలవ్యజనం జగ్రాహ పురతః స్థితః |**
**అపరం చంద్రసంకాశం రాక్షసేంద్రో విభీషణః || ౨౯**

అర్థం – తెలుపు రంగు వాలవ్యజనమును (చామరమును) ముందువైపున, చంద్రప్రభ కలిగిన రాక్షసరాజగు విభీషణుడు పట్టుకొనెను.

**ఋషిసంఘైస్తదాఽఽకాశే దేవైశ్చ సమరుద్గణైః |**
**స్తూయమానస్య రామస్య శుశ్రువే మధురధ్వనిః || ౩౦**

అర్థం – అప్పుడు ఆకాశమునందు ఋషిసమూహములు, దేవతలు మరియు మరుద్గణములు చేయుచున్న రాముని యొక్క కీర్తనలు మధురముగా వినిపించినవి.

**తతః శత్రుంజయం నామ కుంజరం పర్వతోపమమ్ |**
**ఆరురోహ మహాతేజాః సుగ్రీవః ప్లవగర్షభః || ౩౧**

అర్థం – అప్పుడు, శత్రుంజయ అను పర్వతము వంటి ఏనుగును మహాతేజోవంతుడు, వానరముఖ్యుడు అగు సుగ్రీవుడు అధిరోహించెను.

**నవనాగసహస్రాణి యయురాస్థాయ వానరాః |**
**మానుషం విగ్రహం కృత్వా సర్వాభరణభూషితాః || ౩౨**

అర్థం – తొమ్మిది వేల ఏనుగులను అధిరోహించి వెంట వెళుతున్న వానరులు మనుష్యరూపమున సర్వాభరణములతో అగుపించిరి.

**శంఖశబ్దప్రణాదైశ్చ దుందుభీనాం చ నిస్స్వనైః |**
**ప్రయయౌ పురుషవ్యాఘ్రస్తాం పురీం హర్మ్యమాలినీమ్ ||** ౩౩

అర్థం – శంఖము యొక్క శబ్దము మరియు దుందుభీ (ఢంకా) యొక్క ధ్వనులు మారుమ్రోగుతుండగా, పురుషవ్యాఘ్రము (పురుషులలో పులివంటివాడు) భవనముల మాలలు కలిగిన (అయోధ్య) పురమునందు వెడలసాగెను.

**దదృశుస్తే సమాయాంతం రాఘవం సపురస్సరమ్ |**
**విరాజమానం వపుషా రథేనాతిరథం తదా ||** ౩౪

అర్థం – ముందు పరిచారకులతో వచ్చుచున్న రాఘువుడు అందమైన రూపముతో, అతిరథుని (గొప్ప యోధుని) వలె కనిపించెను.

**తే వర్ధయిత్వా కాకుత్స్థం రామేణ ప్రతినందితాః |**
**అనుజగ్ముర్మహాత్మానం భ్రాతృభిః పరివారితమ్ ||** ౩౫

అర్థం – తనకు జేజేలు పలుకు వారిని కాకుత్స్థుడు (రాముడు) తిరిగి పలకరింపగా, వారు కూడా సోదరులు చుట్టూ ఉన్న రాముడిని అనుసరించిరి.

**అమాత్యైర్బ్రాహ్మణైశ్చైవ తథా ప్రకృతిభిర్వృతః |**
**శ్రియా విరురుచే రామో నక్షత్రైరివ చంద్రమాః ||** ౩౬

అర్థం – మంత్రులు, బ్రాహ్మణులు మరియు పౌరులు చుట్టూ ఉన్న ప్రకాశవంతుడగు రాముడు, నక్షత్రముల మధ్య చంద్రునివలె శోభించెను.

**స పురోగామిభిస్తూర్యైస్తాలస్వస్తికపాణిభిః |**
**ప్రవ్యాహరద్భిర్ముదితైర్మంగళాని యయౌ వృతః ||** ౩౭

అర్థం – ముందువైపు నడుస్తున్నవారు తాళములు, స్వస్తిక వాద్యపరికరములు హస్తములలో పట్టుకొని ఆనందకరము, మంగళకరము అగు కీర్తనలు ఆలాపింపగా రాముడు వెడలసాగెను.

**అక్షతం జాతరూపం చ గావః కన్యాస్తథా ద్విజాః |**
**నరా మోదకహస్తాశ్చ రామస్య పురతో యయుః ||** ౩౮

అర్థం – బంగారువర్ణము గల అక్షతలతో (బియ్యపుగింజలు), గోవులతో, కన్యలతో, ద్విజులతో (బ్రాహ్మణులు) వచ్చుచున్న మగవారు తమ చేతిలో తీపిపదార్థములు పట్టుకుని రాముని ముందువైపు వెళ్ళసాగారు.

**సఖ్యం చ రామః సుగ్రీవే ప్రభావం చానిలాత్మజే |**
**వానరాణాం చ తత్కర్మ రాక్షసానాం చ తద్బలమ్ |**
**విభీషణస్య సంయోగమాచచక్షే చ మంత్రిణామ్ ||** ౩౯

అర్థం – రాముడు, సుగ్రీవునితో స్నేహమును, అనిలాత్మజుని (హనుమంతుని) బలమును, వానరులు చేసిన మహత్కార్యములు, రాక్షసులు మరియు వారి బలములను, విభీషణుతో జరిగిన సమావేశమును, మంత్రులకు వర్ణించసాగెను.

**శ్రుత్వా తు విస్మయం జగ్మురయోధ్యాపురవాసినః ॥ ४०**

అర్థం – ఇది వినిన అయోధ్యా పురవాసులు విస్మయము (ఆశ్చర్యము) చెందిరి.

**ద్యుతిమానేతదాఖ్యాయ రామో వానరసంవృతః |**
**హృష్టపుష్టజనాకీర్ణామయోధ్యాం ప్రవివేశ హ ॥ ४१**

అర్థం – ప్రకాశవంతుడైన రాముడు వాటిని గుర్తు చేసుకుని ముచ్చటించుతూ, వానరములతో కలసి ఆనందభరితమైన జనసందోహముతో అయోధ్యలో ప్రవేశించెను.

**తతో హ్యభ్యుచ్ఛ్రయన్పౌరాః పతాకాస్తే గృహే గృహే ॥ ४२**

అర్థం – తరువాత పౌరులు పతాకములను తమ తమ గృహములపై ఎగురవేసిరి.

**ఐక్ష్వాకాధ్యుషితం రమ్యమాససాద పితుర్గృహమ్ ॥ ४३**

అర్థం – రమ్యము, ఇక్ష్వాకు రాజగృహము అయిన తన తండ్రిగృహమునకు (రాముడు) చేరెను.

**అథాబ్రవీద్రాజసుతో భరతం ధర్మిణాం వరమ్ |**
**అర్థోపహితయా వాచా మధురం రఘునందనః ॥ ४४**

అర్థం – తరువాత ఆ రాజపుత్రుడగు రఘునందనుడు (రాముడు), ధర్మము పాటించు భరతునితో అర్థవంతమైన వచనమును మధురముగా పలకసాగెను.

**పితుర్భవనమాసాద్య ప్రవిశ్య చ మహాత్మనః |**
**కౌసల్యాం చ సుమిత్రాం చ కైకేయీమభివాద్య చ ॥ ४५**

అర్థం – పితృగృహమునందు ప్రవేశించిన ఆ మహాత్ముడు, కౌసల్యా, సుమిత్రా మరియు కైకేయీ లకు నమస్కరించెను. (తరువాత ఇటుల చెప్పసాగెను).

**యచ్చ మద్భవనం శ్రేష్ఠం సాశోకవనికం మహత్ |**
**ముక్తావైడూర్యసంకీర్ణం సుగ్రీవాయ నివేదయ ॥ ४६**

అర్థం – "(భరతా!) నా ఈ భవనము శ్రేష్ఠమైనది, అశోకవనములతో కూడియున్నది, ముత్యములు మరియు వైడూర్యములతో పొదగబడియున్నది. దీనిని సుగ్రీవునకు చూపుము" అనెను.

**తస్య తద్వచనం శ్రుత్వా భరతః సత్యవిక్రమః |**
**పాణౌ గృహీత్వా సుగ్రీవం ప్రవివేశ తమాలయమ్ || ౪౭**

అర్థం – ఆ వచనమును వినిన సత్యపరాక్రమవంతుడగు భరతుడు, సుగ్రీవుని చేతిని పట్టుకొని ఆ గృహములోనికి తీసుకువచ్చెను.

**తతస్తైలప్రదీపాంశ్చ పర్యంకాస్తరణాని చ |**
**గృహీత్వా వివిశుః క్షిప్రం శత్రుఘ్నేన ప్రచోదితాః || ౪౮**

అర్థం – అప్పుడు తైలదీపములు, మంచములు, నేలచాపలు తీసుకుని శత్రుఘ్నుని ఆనతి మేర కొందరు (సహాయకులు) గృహములోకి వచ్చిరి.

**ఉవాచ చ మహాతేజాః సుగ్రీవం రాఘవానుజః |**
**అభిషేకాయ రామస్య దూతానాజ్ఞాపయ ప్రభో || ౪౯**

అర్థం – మహాతేజోవంతుడగు రాఘవుని తమ్ముడు (భరతుడు) సుగ్రీవునితో "రాముని అభిషేకముకొరకు దూతలను పురమాయింపుము" అని అడిగెను.

**సౌవర్ణాన్వానరేంద్రాణాం చతుర్ణాం చతురో ఘటాన్ |**
**దదౌ క్షిప్రం స సుగ్రీవః సర్వరత్నవిభూషితాన్ || ౫౦**

అర్థం – సువర్ణమయము, సర్వరత్నమయములు అయిన నాలుగు కుండలను నలుగురు వానరశ్రేష్ఠులకు సుగ్రీవుడు త్వరగా ఇచ్చెను. (తరువాత ఇట్లు పలికెను.)

**యథా ప్రత్యూషసమయే చతుర్ణాం సాగరాంభసామ్ |**
**పూర్ణైర్ఘటైః ప్రతీక్షధ్వం తథా కురుత వానరాః || ౫౧**

అర్థం – "రేపు తెల్లవారే లోపుగా నాలుగు సాగర జలములతో ఈ కుండలను నింపి, నా ఆజ్ఞకోసము వేచియుండండి" అని పలికెను.

**ఏవముక్తా మహాత్మానో వానరా వారణోపమాః |**
**ఉత్పేతుర్గగనం శీఘ్రం గరుడా ఇవ శీఘ్రగాః || ౫౨**

అర్థం – మహాత్ముడగు వానరశ్రేష్ఠుడు ఇటుల చెప్పగనే, వారు గరుడునివలె వేగముగా ఆకాశమునకు ఎగిరి వెళ్ళిరి.

**జాంబవాంశ్చ హనూమాంశ్చ వేగదర్శీ చ వానరః |**
**ఋషభశ్చైవ కలశాఞ్జలపూర్ణానథానయన్ || ౫౩**

అర్థం – అటు తరువాత జాంబవంతుడు, హనుమంతుడు, వేగదర్శీ మరియు ఋషభుడు అను వానరులు,

నీరునింపబడిన కలశములతో వచ్చిరి.

**నదీశతానాం పంచానాం జలం కుంభేషు చాహరన్ || ౫౪**

అర్థం – అయిదువందల నదులలోని జలములతో ఆ కలశములు నింపబడియున్నవి.

**పూర్వాత్సముద్రాత్కలశం జలపూర్ణమథానయత్ |**
**సుషేణః సత్త్వసంపన్నః సర్వరత్నవిభూషితమ్ || ౫౫**

అర్థం – తూర్పుసముద్రము యొక్క నీటిచే నింపబడిన, రత్నమయమైన కలశమును సత్త్వగుణ సంపన్నుడైన సుషేణుడు తెచ్చెను.

**ఋషభో దక్షిణాత్తూర్ణం సముద్రాజ్జలమాహరత్ |**
**రక్తచందనశాఖాభిః సంవృతం కాంచనం ఘటమ్ || ౫౬**

అర్థం – ఋషభుడు త్వరగా దక్షిణసముద్రము యొక్క జలమును, ఎర్రచందనపు కాండములతో మూసినటువంటి బంగారు కుండలో తెచ్చెను.

**గవయః పశ్చిమాత్తోయమాజహార మహార్ణవాత్ |**
**రత్నకుంభేన మహతా శీతం మారుతవిక్రమః || ౫౭**

అర్థం – గవయుడు పశ్చిమమహాసముద్రము యొక్క చల్లటి జలమును రత్నభూషితమైన కుంభము (కలశము) లో వాయువేగముగ తెచ్చెను.

**ఉత్తరాచ్చ జలం శీఘ్రం గరుడానిలవిక్రమః |**
**ఆజహార స ధర్మాత్మా నలః సర్వగుణాన్వితః || ౫౮**

అర్థం – ఉత్తరమందున్న జలమును శీఘ్రముగా, గరుడ మరియు వాయువిక్రమము గల ధర్మాత్ముడు, సర్వగుణసంపన్నుడు అయిన నలుడు తెచ్చెను.

**తతస్తైర్వానరశ్రేష్ఠైరానీతం ప్రేక్ష్య తజ్జలమ్ |**
**అభిషేకాయ రామస్య శత్రుఘ్నః సచివైః సహ |**
**పురోహితాయ శ్రేష్ఠాయ సుహృద్భ్యశ్చ న్యవేదయత్ || ౫౯**

అర్థం – అలా వానరశ్రేష్ఠులచే రామ పట్టాభిషేకము కొరకు తీసుకురాబడిన జలముల గురించి, శత్రుఘ్నుడు తన మంత్రులతో కలసి, పురోహిత శ్రేష్ఠులకు మరియు వారి సహచరులకు విన్నవించెను.

**తతః స ప్రయతో వృద్ధో వసిష్ఠో బ్రాహ్మణైః సహ |**
**రామం రత్నమయే పీఠే సహసీతం న్యవేశయత్ || ౬౦**

అర్థం – అప్పుడు వారిలో పెద్దవారైన వశిష్ఠులవారు, తోటి బ్రాహ్మణులతో కలసి, రత్నమయ పీఠము పైన శ్రీరాముడిని సీతతో సహా మర్యాదపూర్వకంగా కూర్చుండబెట్టెను.

**వసిష్ఠో వామదేవశ్చ జాబాలిరథ కాశ్యపః |**
**కాత్యాయనః సుయజ్ఞశ్చ గౌతమో విజయస్తథా || ౬౧**

అర్థం – వశిష్ఠుడు, వామదేవుడు, జాబాలి, కశ్యపుడు, కాత్యాయనుడు, సుయజ్ఞుడు, గౌతముడు మరియు విజయుడు ..

**అభ్యషించన్నరవ్యాఘ్రం ప్రసన్నేన సుగంధినా |**
**సలిలేన సహస్రాక్షం వసవో వాసవం యథా || ౬౨**

అర్థం – .. నరవ్యాఘ్రమును (నరులలో పులివంటి రాముడికి) సంతోషభరితముగా సుగంధభరితమైన జలములతో, అష్టవసువులు సహస్రాక్షునికి (ఇంద్రునికి) చేసినట్లు, అభిషేకము చేసిరి.

**ఋత్విగ్భిర్బ్రాహ్మణైః పూర్వం కన్యాభిర్మంత్రిభిస్తథా |**
**యోధైశ్చైవాభ్యషించంస్తే సంప్రహృష్టాః సనైగమైః || ౬౩**

అర్థం – ఋత్విక్కులు మొదట బ్రాహ్మణులతో, తరువాత కన్యలతో, మంత్రులతో, యోధులతో, ఆనందముగా యున్న పట్టణవాసులతో అభిషేకము చేయించితిరి.

**సర్వౌషధిరసైర్దివ్యైర్దైవతైర్నభసి స్థితైః |**
**చతుర్భిర్లోకపాలైశ్చ సర్వైర్దేవైశ్చ సంగతైః || ౬౪**

అర్థం – సర్వ ఔషధరసములు కలిసిన పన్నీరును ఆకాశమందున్న దేవతలు, నలుగురు లోకపాలకులు, సర్వదేవతలు కలిసి చల్లిరి.

**బ్రహ్మణా నిర్మితం పూర్వం కిరీటం రత్నశోభితమ్ |**
**అభిషిక్తః పురా యేన మనుస్తం దీప్తతేజసమ్ || ౬౫**

అర్థం – బ్రహ్మచే (సృష్టికి) పూర్వం నిర్మించినటువంటి కిరీటము రత్నములశోభతో యున్నది. దీనితో చాలా కాలము క్రితము మను కు పట్టాభిషేకము చేయుటవలన తేజస్సుచే దీప్తమైనది.

**తస్యాన్వవాయే రాజానః క్రమాద్యేనాభిషేచితాః |**
**సభాయాం హేమక్లుప్తాయాం శోభితాయాం మహాధనైః |**
**రత్నైర్నానావిధైశ్చైవ చిత్రితాయాం సుశోభనైః || ౬౬**

అర్థం – ఆయన తరువాత ఉన్న రాజుల క్రమమునకు (పరంపరకు) దీనిచే పట్టాభిషేకము చేయబడినది. (ఇప్పుడు) సభయందు బంగారువర్ణపు శోభతో, మహాధనవంతమగునది, వివిధరత్నములచేత చిత్రముగా మంచిశోభను కలిగియున్నది.

**నానారత్నమయే పీఠే కల్పయిత్వా యథావిధి |**
**కిరీటేన తతః పశ్చాద్వసిష్ఠేన మహాత్మనా |**
**ఋత్విగ్భిర్భూషణైశ్చైవ సమయోక్ష్యత రాఘవః || ౬౭**

అర్థం – నానారత్నములు పొదగబడినటువంటి పీఠముపై యథావిధిగా ఉంచబడిన కిరీటమును అటు పిమ్మట మహాత్ముడైన వసిష్ఠులవారు (తన) తోటి ఋత్విక్కులతో కలసి మిగిలిన భూషణములతోపాటు రాఘవునకు అలంకారము చేసిరి.

**ఛత్రం తు తస్య జగ్రాహ శత్రుఘ్నః పాండురం శుభమ్ |**
**శ్వేతం చ వాలవ్యజనం సుగ్రీవో వానరేశ్వరః |**
**అపరం చంద్రసంకాశం రాక్షసేంద్రో విభీషణః || ౬౮**

అర్థం – శుభకరమైన ధవళ ఛత్రమును (గొడుగు) శత్రుఘ్నుడు పట్టుకొనెను. తెలుపు రంగు వాలవ్యజనమును (చామరమును) వానరేశ్వరుడగు సుగ్రీవుడు పట్టుకొనెను. చంద్రునివలె మెరయు మరియొక వ్యజనమును రాక్షసరాజగు విభీషణుడు గొనెను.

**మాలాం జ్వలంతీం వపుషా కాంచనీం శతపుష్కరామ్ |**
**రాఘవాయ దదౌ వాయుర్వాసవేన ప్రచోదితః || ౬౯**

అర్థం – నూరు బంగారు పద్మములతో అందముగా వెలుగొందు మాలను, రాఘవునకు వాయుదేవుడు, వాసవుని (ఇంద్రుని) ప్రోత్సాహముతో ఇచ్చెను.

**సర్వరత్నసమాయుక్తం మణిరత్నవిభూషితమ్ |**
**ముక్తాహారం నరేంద్రాయ దదౌ శక్రప్రచోదితః || ౭౦**

అర్థం – సర్వరత్నములతో పొదగబడి, మణిరత్నముతో విశేషముగా భాసించు ముత్యములహారమును, ఆ రాజునకు, శక్రుని (ఇంద్రుని) ఆదేశము మేర (వాయుదేవుడు) ఇచ్చినాడు.

**ప్రజగుర్దేవగంధర్వా ననృతుశ్చాప్సరోగణాః |**
**అభిషేకే తదర్హస్య తదా రామస్య ధీమతః || ౭౧**

అర్థం – లావణ్యముగా అలాపించు దేవగంధర్వుల పాటలు, అందముగా నాట్యమాడు అప్సర గణములు, బుద్ధిశాలియగు రాముని పట్టాభిషేకమునకు తగిన రీతిలో ఉండెను.

**భూమిః సస్యవతీ చైవ ఫలవంతశ్చ పాదపాః |**
**గంధవంతి చ పుష్పాణి బభూవూ రాఘవోత్సవే || ౭౨**

అర్థం – భూమి సస్యశ్యామలముగా, ఫలములుతో చెట్లు, మంచి సువాసనలతో పుష్పములు, రాఘవ ఉత్సవములో నిండినవి.

**సహస్రశతమశ్వానాం ధేనూనాం చ గవాం తథా |**
**దదౌ శతం వృషాన్పూర్వం ద్విజేభ్యో మనుజర్షభః || ౭౩**

అర్థం – నూరు సహస్రములగా అశ్వములను, ధేనువులను, గోవులను, నూరు వృషభములను మొదటగా ద్విజులకు మనుజ శ్రేష్ఠుడు (రాముడు) ఇచ్చెను.

**త్రింశత్కోటీర్హిరణ్యస్య బ్రాహ్మణేభ్యో దదౌ పునః |**
**నానాభరణవస్త్రాణి మహార్హాణి చ రాఘవః || ౭౪**

అర్థం – మూడువందలకోట్ల బంగారునాణెములు, నానావిధములైన, విలువైన, ఆభరణములు, వస్త్రములను బ్రాహ్మణులకు రాఘవుడు మళ్ళీ ఇచ్చెను.

**అర్కరశ్మిప్రతీకాశాం కాంచనీం మణివిగ్రహామ్ |**
**సుగ్రీవాయ స్రజం దివ్యాం ప్రాయచ్ఛన్మనుజర్షభః || ౭౫**

అర్థం – సూర్యరశ్మివంటి ప్రభతో, బంగారముతో పొదగబడిన మణులు కలిగిన దివ్యమైన మాలను సుగ్రీవునకు మనుజర్షభుడు (రాముడు) ఇచ్చెను.

**వైడూర్యమణిచిత్రే చ వజ్రరత్నవిభూషితే |**
**వాలిపుత్రాయ ధృతిమానంగదాయాంగదే దదౌ || ౭౬**

అర్థం – వైడూర్యమణితో చిత్రితమై, వజ్రరత్నముతో విభూషితమైన అంగదమును (కేయూరమును) వాలిపుత్రుడు, ధృతిమంతుడు అయిన అంగదునకు (రాముడు) ఇచ్చెను.

**మణిప్రవరజుష్టం చ ముక్తాహారమనుత్తమమ్ |**
**సీతాయై ప్రదదౌ రామశ్చంద్రరశ్మిసమప్రభమ్ || ౭౭**

అర్థం – శ్రేష్ఠములైన మణులతో, చంద్రకాంతితో సమానమైన ప్రభతో యున్న, ఉత్తమమైన ముత్యాలహారమును రాముడు సీతకు ఇచ్చెను.

**అరజే వాససీ దివ్యే శుభాన్యాభరణాని చ |**
**అవేక్షమాణా వైదేహీ ప్రదదౌ వాయుసూనవే || ౭౮**

అర్థం – శుద్ధము, ధారణయోగ్యము, శుభకరము యైన ఆభరణములను వైదేహీ వాయుసూనునకు (హనుమంతుడు) ఇవ్వజూచెను.

**అవముచ్యాత్మనః కంఠాద్ధారం జనకనందినీ |**
**అవైక్షత హరీన్సర్వాన్భర్తారం చ ముహుర్ముహుః || ౭౯**

అర్థం – జనకనందిని (సీత) తన కంఠమునకు ధరించినది తీయుట అక్కడ ఉన్న వానరులతో పాటు తన భర్త

కూడా మరల మరల చూడసాగిరి.

**తామింగితజ్ఞః సంప్రేక్ష్య బభాషే జనకాత్మజామ్ |**
**ప్రదేహి సుభగే హారం యస్య తుష్టాసి భామిని |**
**పౌరుషం విక్రమో బుద్ధిర్యస్మిన్నేతాని సర్వశః || ౮౦**

అర్థం – ఇంగితజ్ఞానము కల రాముడు, జనకాత్మజయగు సీతను చూచి ఇట్లనెను. "ప్రియమైన సీతా, ఆ హారమును నీవు ఎవరికి ఇస్తే ఆనందము కలుగునో, ఎవ్వరికి తేజస్సు, ధృతి, యశస్సు, దాక్షిణ్యము, సామర్థ్యము, వినయము, దూరదృష్టి, వీరత్వము, పరాక్రమము, మేధస్సు నిత్యము ఉండునో వారికి ఇవ్వుము."

**దదౌ సా వాయుపుత్రాయ తం హారమసితేక్షణా |**
**హనుమాంస్తేన హారేణ శుశుభే వానరర్షభః |**
**చంద్రాంశుచయగౌరేణ శ్వేతాభ్రేణ యథాఽచలః || ౮౧**

అర్థం – ఆ హారమును అసితేక్షణా (నల్లటి కనులు కలిగిన సీత) వాయుపుత్రునకు ఇచ్చెను. వానర వరేణ్యుడగు హనుమంతుడు ఆ హారమును ధరించగా, చంద్రకాంతులతో, తెల్లని మబ్బులతో అలంకరింపబడిన పర్వతమువలె అగుపించెను.

**తతో ద్వివిదమైందాభ్యాం నీలాయ చ పరన్తపః |**
**సర్వాన్కామగుణాన్వీక్ష్య ప్రదదౌ వసుధాధిపః || ౮౨**

అర్థం – శత్రువులను హింసించునట్టి ద్వివిదునకు, మైందునకు మరియు నీలునకు వారి ఇష్టములను బట్టి వసుధాధిపుడు (రాముడు) బహుమతులు ఇచ్చెను.

**సర్వవానరవృద్ధాశ్చ యే చాన్యే వానరేశ్వరాః |**
**వాసోభిర్భూషణైశ్చైవ యథార్హం ప్రతిపూజితాః || ౮౩**

అర్థం – సర్వవానరవృద్ధులు, ఇతర వానరేశ్వరులు యథాయోగ్యముగా వస్త్రాభరణములతో సన్మానింపబడిరి.

**విభీషణోఽథ సుగ్రీవో హనుమాన్ జాంబవాంస్తథా |**
**సర్వవానరముఖ్యాశ్చ రామేణాక్లిష్టకర్మణా || ౮౪**

అర్థం – విభీషణుని, సుగ్రీవుని, హనుమంతుని, జాంబవంతుని మరియు సర్వ వానరవృద్ధులను రాముడికోసం విసుగు, అలసట చెందకుండా ఉన్నవారిని..

**యథార్హం పూజితాః సర్వైః కామై రత్నైశ్చ పుష్కలైః |**
**ప్రహృష్టమనసః సర్వే జగ్మురేవ యథాగతమ్ || ౮౫**

అర్థం – .. వారికి ఇష్టములైన అన్ని రత్నములతో సత్కారములు చేయగా, వారు సంతోషమనస్కులై తిరిగి వెడలిరి.

**నత్వా సర్వే మహాత్మానం తతస్తే ప్లవగర్షభాః |**
**విసృష్టాః పార్థివేంద్రేణ కిష్కింధామభ్యుపాగమన్ || ౮౬**

అర్థం – వందనము చేయుచూ ఆ మహాత్ములగు వానరోత్తములు, పార్థివేంద్రునచే (రామునిచే) వీడ్కోలు తెలుపబడి కిష్కింధకు వెడలిరి.

**సుగ్రీవో వానరశ్రేష్ఠో దృష్ట్వా రామాభిషేచనమ్ |**
**పూజితశ్చైవ రామేణ కిష్కింధాం ప్రావిశత్పురీమ్ || ౮౭**

అర్థం – వానరశ్రేష్ఠుడగు సుగ్రీవుడు రామ పట్టాభిషేకము చూచి, రామునిచే సత్కరింపబడి కిష్కింధకు వెడలెను.

**[రామేణ సర్వకామైశ్చ యథార్హం ప్రతిపూజితః |]**
**విభీషణోఽపి ధర్మాత్మా సహ తైర్నైరృతర్షభైః |**
**లబ్ధ్వా కులధనం రాజా లంకాం ప్రాయాద్విభీషణః || ౮౮**

అర్థం – ధర్మాత్ముడు, ప్రఖ్యాతి కలిగిన రాక్షసరాజగు విభీషణుడు, తన కులధనము (రాక్షస రాజ్యము మరియు పరివారము) తీసుకుని లంకకు మరలెను.

**స రాజ్యమఖిలం శాసన్నిహతారిర్మహాయశాః |**
**రాఘవః పరమోదారః శశాస పరయా ముదా || ౮౯**

అర్థం – అఖిల రాజ్యములు శాసించగల, శత్రువులను సంహరించిన, మహాయశస్సు కలిగిన రాఘవుడు పరమ ఔదార్యముతో, పరమ ఆనందముతో ..

**ఉవాచ లక్ష్మణం రామో ధర్మజ్ఞం ధర్మవత్సలః || ౯౦**

అర్థం – .. ధర్మజ్ఞుడైన లక్ష్మణునితో ధర్మవత్సలుడగు రాముడు ఇట్లనెను.

**ఆతిష్ఠ ధర్మజ్ఞ మయా సహేమాం**
**గాం పూర్వరాజాధ్యుషితాం బలేన |**
**తుల్యం మయా త్వం పితృభిర్ధృతా యా**
**తాం యౌవరాజ్యే ధురముద్వహస్వ || ౯౧**

అర్థం – "ధర్మజ్ఞా (ధర్మము తెలిసినవాడా), నాతో పాటు ఈ భూమిని (రాజ్యమును) పూర్వరాజులు సైన్యముతో కూడి పాలించినట్లు, నేను మన పితరుల నుంచి పొందినట్లు, నీవు కూడా యువరాజు వలె రాజ్యభారమును తీసుకొనుము.

**సర్వాత్మనా పర్యనునీయమానో**
**యదా న సౌమిత్రిరుపైతి యోగమ్ |**
**నియుజ్యమానోఽపి చ యౌవరాజ్యే**

**తతోఽభ్యషించద్భరతం మహాత్మా || ౯౨**

అర్థం – అన్నివిధముల బ్రతిమిలాడినగాని సౌమిత్రి (లక్ష్మణుడు) అంగీకారము తెలుపని కారణమున, యౌవరాజ్యాభిషేకమును మహాత్ముడు (రాముడు) భరతునకు చేసెను.

**పౌండరీకాశ్వమేధాభ్యాం వాజపేయేన చాసకృత్ |**
**అన్యైశ్చ వివిధైర్యజ్ఞైరయజత్పార్థివర్షభః || ౯౩**

అర్థం – పౌండరీకము, అశ్వమేధము, వాజపేయాది ఇతర యజ్ఞములు పార్థివర్షభుడు (రాముడు) ఆచరించెను.

**రాజ్యం దశసహస్రాణి ప్రాప్య వర్షాణి రాఘవః |**
**శతాశ్వమేధానాజహ్రే సదశ్వాన్భూరిదక్షిణాన్ || ౯౪**

అర్థం – రాజ్యమును పదివేల వర్షములు అనుభవించిన రాఘవుడు నూరు అశ్వమేధయజ్ఞములలో మంచి అశ్వములు మరియు దక్షిణలు దేవతలకోసము సమర్పించెను.

**ఆజానులంబబాహుః స మహాస్కంధః ప్రతాపవాన్ |**
**లక్ష్మణానుచరో రామః పృథివీమన్వపాలయత్ || ౯౫**

అర్థం – జానువులవరకు ఉన్న పొడవైన మహా భుజములతో, ప్రతాపవంతుడై, లక్ష్మణుని తోడుగా, రాముడు పృథివిని పాలించెను.

**రాఘవశ్చాపి ధర్మాత్మా ప్రాప్య రాజ్యమనుత్తమమ్ |**
**ఈజే బహువిధైర్యజ్ఞైః ససుహృజ్జ్ఞాతిబాంధవః || ౯౬**

అర్థం – ధర్మాత్ముడగు రాఘవుడు గొప్పది ఉత్తమమైనది అగు రాజ్యమును పొంది, దేవతల ప్రసన్నము కొరకు బహువిధ యజ్ఞములు, తన పుత్రులు, భ్రాతృలతో, బంధువులతో కలసి చేసెను.

**న పర్యదేవన్విధవా న చ వ్యాలకృతం భయమ్ |**
**న వ్యాధిజం భయం వాఽపి రామే రాజ్యం ప్రశాసతి || ౯౭**

అర్థం – వైధవ్య విషాదము, క్రూరమృగముల భయము, వ్యాధి భయములు లేక రామ రాజ్యము కీర్తింపబడెను.

**నిర్దస్యురభవల్లోకో నానర్థః కంచిదస్పృశత్ |**
**న చ స్మ వృద్ధా బాలానాం ప్రేతకార్యాణి కుర్వతే || ౯౮**

అర్థం – చోరత్వము లోకమునందు లేదు. జనుల యందు వ్యర్థభావము లేకుండె. వృద్ధులు బాలురపై ప్రేతకార్యములు చేయకుండిరి.

**సర్వం ముదితమేవాసీత్సర్వో ధర్మపరోఽభవత్ |**
**రామమేవానుపశ్యంతో నాభ్యహింసన్పరస్పరమ్ || ౯౯**

అర్థం – అంతా ఆనందముతో ఉండెను. అందరూ ధర్మపరులై ఉండిరి. రాముని దృష్టిలో ఉంచుకుని పరస్పరము హింసించుకొనక యుండిరి.

**ఆసన్వర్షసహస్రాణి తథా పుత్రసహస్రిణః |**
**నిరామయా విశోకాశ్చ రామే రాజ్యం ప్రశాసతి || ౧౦౦**

అర్థం – వేల వర్షముల (ఆయుర్దాయము) తో, వేలమంది పుత్రులతో, అనారోగ్యము లేక, శోకములేక రామునిచే రాజ్యము పాలింపబడెను.

**రామో రామో రామ ఇతి ప్రజానామభవన్కథాః |**
**రామభూతం జగదభూద్రామే రాజ్యం ప్రశాసతి || ౧౦౧**

అర్థం – రామ, రామ, రామ అని రాముని గురించి, రామరాజ్యము గురించి ప్రజలు చర్చించుకొనిరి. జగత్తంతా రామరాజ్యమును కీర్తించెను.

**నిత్యపుష్పా నిత్యఫలాస్తరవః స్కంధవిస్తృతాః |**
**కాలే వర్షీ చ పర్జన్యః సుఖస్పర్శశ్చ మారుతః || ౧౦౨**

అర్థం – నిత్యము పుష్పములు, ఫలములతో మరియు విస్తృతమైన కొమ్మలతో చెట్లు ఉండెను. మబ్బులు సకాలములయందు వర్షించెను. మారుతము (గాలి) సుఖస్పర్శతో వీచెను.

**బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాః శూద్రా లోభవివర్జితాః |**
**స్వకర్మసు ప్రవర్తంతే తుష్టాః స్వైరేవ కర్మభిః || ౧౦౩**

అర్థం – బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు లోభము లేక, తమ తమ కర్మలయందు ఆనందముగా ప్రవర్తించుచుండిరి.

**ఆసన్ప్రజా ధర్మరతా రామే శాసతి నానృతాః |**
**సర్వే లక్షణసంపన్నాః సర్వే ధర్మపరాయణాః || ౧౦౪**

అర్థం – ప్రజలు ధర్మపరులై, అనృతములు (కఠినమైన మాటలు) అనక రామరాజ్యమున అందరు మంచి లక్షణములతో ధర్మపరాయణులై యుండిరి.

**దశ వర్షసహస్రాణి దశ వర్షశతాని చ |**
**భ్రాతృభిః సహితః శ్రీమాన్రామో రాజ్యమకారయత్ || ౧౦౫**

అర్థం – పదివేల పదివందల వర్షములు, తన భ్రాతృలతో కలిసి శ్రీరాముడు రాజ్యపాలనను చేసెను.

———————————

(రామాయణ ఫలశ్రుతి)

ధన్యం యశస్యమాయుష్యం రాజ్ఞాం చ విజయావహమ్ |
ఆదికావ్యమిదం త్వార్షం పురా వాల్మీకినా కృతమ్ |
యః పఠేచ్ఛృణుయాల్లోకే నరః పాపాద్విముచ్యతే || ౧౦౬

పుత్రకామస్తు పుత్రాన్వై ధనకామో ధనాని చ |
లభతే మనుజో లోకే శ్రుత్వా రామాభిషేచనమ్ || ౧౦౭

మహీం విజయతే రాజా రిపూంశ్చాప్యధితిష్ఠతి |
రాఘవేణ యథా మాతా సుమిత్రా లక్ష్మణేన చ || ౧౦౮

భరతేనేవ కైకేయీ జీవపుత్రాస్తథా స్త్రియః |
భవిష్యంతి సదానందాః పుత్రపౌత్రసమన్వితాః || ౧౦౯

శ్రుత్వా రామాయణమిదం దీర్ఘమాయుశ్చ విన్దతి |
రామస్య విజయం చైవ సర్వమక్లిష్టకర్మణః || ౧౧౦

శృణోతి య ఇదం కావ్యమార్షం వాల్మీకినా కృతమ్ |
శ్రద్దధానో జితక్రోధో దుర్గాణ్యతితరత్యసౌ || ౧౧౧

సమాగమం ప్రవాసాంతే లభతే చాపి బాంధవైః |
ప్రార్థితాంశ్చ వరాన్సర్వాన్ప్రాప్నుయాదిహ రాఘవాత్ || ౧౧౨

శ్రవణేన సురాః సర్వే ప్రీయంతే సంప్రశృణ్వతామ్ |
వినాయకాశ్చ శామ్యంతి గృహే తిష్ఠంతి యస్య వై || ౧౧౩

విజయేతి మహీం రాజా ప్రవాసీ స్వస్తిమాన్వ్రజేత్ |
స్త్రియో రజస్వలాః శ్రుత్వా పుత్రాన్ సూయురనుత్తమాన్ || ౧౧౪

పూజయంశ్చ పఠంశ్చేమమితిహాసం పురాతనమ్ |
సర్వపాపాత్ప్రముచ్యేత దీర్ఘమాయురవాప్నుయాత్ || ౧౧౫

ప్రణమ్య శిరసా నిత్యం శ్రోతవ్యం క్షత్రియైర్ద్విజాత్ |
ఐశ్వర్యం పుత్రలాభశ్చ భవిష్యతి న సంశయః || ౧౧౬

రామాయణమిదం కృత్స్నం శృణ్వతః పఠతః సదా |
ప్రీయతే సతతం రామః స హి విష్ణుః సనాతనః || ౧౧౭

ఆదిదేవో మహాబాహుర్హరిర్నారాయణః ప్రభుః |
సాక్షాద్రామో రఘుశ్రేష్ఠః శేషో లక్ష్మణ ఉచ్యతే || ౧౧౮

కుటుంబవృద్ధిం ధనధాన్యవృద్ధిం
స్త్రియశ్చ ముఖ్యాః సుఖముత్తమం చ |
శృత్వా శుభం కావ్యమిదం మహార్థం
ప్రాప్నోతి సర్వాం భువి చార్థసిద్ధిమ్ || ౧౧౯

ఆయుష్యమారోగ్యకరం యశస్యం
సౌభ్రాతృకం బుద్ధికరం సుఖం చ |
శ్రోతవ్యమేతన్నియమేన సద్భి-
-రాఖ్యానమోజస్కరమృద్ధికామైః || ౧౨౦

ఏవమేతత్పురావృత్తమాఖ్యానం భద్రమస్తు వః |
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్ధతామ్ || ౧౨౧

దేవాశ్చ సర్వే తుష్యంతి గ్రహణాచ్ఛ్రవణాత్తథా |
రామాయణస్య శ్రవణాత్తుష్యంతి పితరస్తథా || ౧౨౨

భక్త్యా రామస్య యే చేమాం సంహితామృషిణా కృతామ్ |
లేఖయంతీహ చ నరాస్తేషాం వాసస్త్రివిష్టపే || ౧౨౩

ఇత్యార్షే శ్రీమద్రామాయణే వాల్మీకీయే ఆదికావ్యే చతుర్వింశతిసహస్రికాయాం సంహితాయాం యుద్ధకాండే శ్రీరామపట్టాభిషేకో నామ ఏకత్రింశదుత్తరశతతమః సర్గః || ౧౨౪ ||

(ఈ అర్థము శ్రీ మండా కృష్ణశ్రీకాంత శర్మకు స్ఫురించి వ్రాయబడినది.)

***విషూచికా మంత్ర కథనం (యోగవాసిష్ఠం) (https://stotranidhi.com/visuchika-nivarana-mantra-yoga-vasistham-in-telugu/) >>***

---

**గమనిక**: పైన ఇవ్వబడిన స్తోత్రము, ఈ క్రింది పుస్తకములో కూడా ఉన్నది.